॥ శ్రీరస్తు ॥

శ్రీమతే రామానుజాయ పరబ్రహ్మణేనమః.

జగ్గ శింగరార్యేణ

విరచితమిదం

# కృష్ణకథారహస్యం.

మణిసముద్రగ్రామాభిజనేన నంజుండశాస్త్రిణా విరచితేన

ఆంధ్రభాషాతాత్పర్యేణసహితం

కె. ఎన్. నరసింహయ్య ముద్రాక్షరశాలాయాం

ముద్రాపితం సల్ విజయ తేతరాం.

1929.



మూల్యం 0—6—0

# విజ్ఞాపనా.

శ్రీమదనంతకల్యాణగుణగణపరిపూర్ణస్య శ్రీభూనీళానాయ
కస్య పరమకారుణికస్య భగవతో నారాయణస్య అవ్యాజకృపారస
కల్లోలకణప్రసరణమాత్రోపలబ్ధ కవితా వైదగ్ధ్యం సఫలయితుం,
తస్యైవ స్తోత్రముచితం విచింతయన్ నిజావాసస్థానస్య పుణ్యస్థాన
సారతమస్య యదుశైలస్య అధీశం లోకేశం భగవంతం నారాయణ
మధికృత్య యదుశైలచంపూనామకం గ్రంథం వ్యరచయం. అతీత
ద్వాదశవత్సరప్రాయాపీయంచంపూః కస్యాపి రసికజనస్య చిత్తం
నాకర్షతీతి అధునాపి మనో మేదూయతేనితరాం, తన్ముద్రణస్య
ద్రవ్యాభావాది దానీమపి గృహపేటికాయామేవ సుముద్రితాం తాం
ప్రతిపాలయామి ప్రకటయితు మవసరం. చతుర్భ్యో వత్సరేభ్యః
ప్రాక్ విరచితమిదం కృష్ణకథారహస్యంతు స్వల్పశ్లోకపరిమితం స్వల్ప
ద్రవ్యేణముద్రాపయితుం సాధ్యంచ విచింత్య, మహాభాగానాం
కేషాంచిద్యథోచితద్రవ్యసాహాయ్యేన ఇదానీం ముద్రాపితం, సహృ
దయహృదయాకర్షణాయ ప్రభవత్విదమితిప్రార్థయే, కించేదం
కావ్యం ఆంధ్రదేశేషు బహుశః ప్రసరతీతి విచింత్య, అస్య ఆంధ్ర
భాషా తాత్పర్యంచ సాహిత్యరసికైః శ్రీ నంజుండశాస్త్రిభిః సింహ
భట్టనామకాభిజ్ఞైశ్చ అకారయం, అస్యముద్రణకార్యే భూయస్సము
త్తేజనేన, ద్రవ్యసాహాయ్యేన, తాత్పర్యలేఖనేనచ ఉపకృతవతాం
మహతాం విషయే అయం దాసజనః కృతజ్ఞతాం నితరాం సాదరం
అనుసంధత్తే, అత్రగ్రంథే దోషాదీనవలోక్య సముద్బోధ్యోపకుర్వ
తాం నితరాం కృతజ్ఞోఽస్మి.

గ్రంథకర్తా—

జగ్గు శింగరార్యః,

సుజనదాసః.

# శుద్ధాశుద్ధ సూచనా.

| | | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| శ్లోకసంఖ్యా | ౧౪ | త్వచ్చేష్ఠాను | త్వచ్చేష్టాను |
| ,, | ౪౨ | తథాఽత్మబంధు | తథాఽత్మబాధుః |
| ,, | ౪౪ | ప్రీతిఃపరావకకుతో | ప్రీతిఃపరాతవకుతో |
| ,, | ,, | పత్నీంరక్షసపిలా | పత్నీంరరక్షసకిలా |
| ,, | ౪౬ | శ్రీకృష్ణతృత్కటాక్షో | శ్రీకృష్ణత్వత్కటాక్షో |
| ,, | ౪౭ | కిమిహహాఽర్యా | కిమిహాహార్యా |
| , | ౪౯ | విరచిర్యా | విరచర్యా |
| ,, | ,, | కిమఃకృష్ణరతే | కిమఃకృష్ణతే |
| ,, | ౫౧ | విదితాంతరగః | విదితాంతరంగః |
| ,, | ౫౩ | యుక్తానుకిం | యుక్తంనుకిం |
| ,, | ,, | తతోఽసేమంస్యాగమాత్ | తతోఽసేమకస్యాగమాత్ |
| ,, | ౫౪ | వహిసి | వహాసి |
| ,, | ౫౫ | త్వంభీరుసఖి | త్వంభీరుస్సఖి |

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయపరబ్రహ్మణేనమః.

# అథ కృష్ణకథారహస్య ప్రారంభః.



శ్లో॥ శ్రీనాథః పురుషోత్తమ స్త్రిజగతాం సంరక్షణార్థం స్వయం।
సత్వాన్యద్యద్భుతమంగళావతరణో జాతో యదూనాం కులే॥
మోబాల్యాదపియత్నతోఽప్యపలపన్ స్వాన్యావతారోచితం।
వృత్తంవాసనయాపరం వ్యరచయ త్కృష్ణస్సపుష్ణాతునః ॥ ౧ ॥

ఉ॥ ఎవ్వని లీలచేత జగమింపుగజన్మముగాంచినిత్యమున్ ।
ఎవ్వనియందె సొంపెసగ నెల్లసుఖంబులు జెంది యవ్వలన్ ॥
రివ్వనతోయవీచికలరీతిగనెవ్వనిలోనలీనమౌ ।
నవ్వనజాయతేక్షుననిశంబుభజింతునభీష్టసిద్ధికిన్ ॥

తాత్పర్యము.

(అవతారిక)కవితొలుదొల్త ,, మంగళాదీనిమంగళమధ్యాని ” యనెడి పూర్వాచారానుసారంబుగ, నిర్విఘ్నంబుగ గ్రంథసమాప్తి కొరకై యాశీరూపమంగళంబును గ్రంథారంభంబునందు గావించుచున్నాడు.

ఎవడు ముల్లోకంబులను పాలించుటకు,కర్మాధీనుడుగాక స్వేచ్ఛామాత్రంబుననె యద్భుతంబులగు మీనరూపంబాదియైన యవతారంబులందలి చరిత్రను చాలప్రయత్నంబుచే దాచినను, వెనుకటియు

ధ్యానబలంబుననే తెటబరచెనో యట్టి శ్రీకృష్ణపరమాత్ముడు మమ్మును మిమ్మునుఁబోషించుగాక ॥ శ్రీకృష్ణుడు భక్తులకు తన మాహాత్మ్యమును తెలియజేయుటకై, గీతాద్యుపదేశంబులు చేసి విరాట్స్వరూపమును బాగుగ వెల్లడిపరచియుండగ, ఇచ్చట “చాలప్రయత్నంబుచేత నిజ చరిత్రను దాచెనని” కవివర్ణించియుండుటయసంగతమని భావింపగూడదు. ఏలయన, భాగవతమున శ్రీకృష్ణుడే తన చెలికాండ్రగుగోపకులతో నిట్లు ముచ్చటించియున్నాడు “నాహం దేవో నగంధర్వో-అహం వో బాంధవో జాతః” అని॥ ఇచట మత్స్యాద్యద్భుతమంగళావతరణః” “వాసనయాపరంవ్యరచయత్” అని చెప్పుటచేత సామాన్యంబుగ మ్యందరిమెల్లశ్లోకంబులు పూర్వచరిత్రబోధకార్థగర్భితంబులని తెలయతగ్గది॥ మంగళశ్లోకంబున గ్రంథార్థసూచనంబు కవిసంప్రదాయసిద్ధంబుగాన తన్మార్గగామియైన ఈతడుగూడనట్లేగావించియుండుటచేత, ఇతడుగూడనొక్కసుకవియనియు. ఈగ్రంథముత్తమకావ్యమనియును ఎన్నబడును.

(అవతారిక) కవి తన వంశానుక్రమంబును చెప్పుచున్నాడు।

శ్లో॥ శ్రీశింగరార్యసుకవేర్మహితస్య పౌత్రో।
నారాయణార్యతనయశ్శ్రితశింగరాఖ్యః॥
కృత్వామహేశకరుణయా యదుశైలచంపూం।
బధ్నాతి కావ్యమిహకృష్ణకథారహస్యం ॥ ౨ ॥

తా॥ సుకవియు పూజ్యుడునగు శింగరాచార్యులవారి పౌత్రుడు నారాయణాచార్యులవారి పుత్త్రుడు నగు శింగరాఖ్యకవి పరమాత్ముని యనుగ్రహమువల్ల మొదట “యదుశైలచంపువు”

అనెడి గ్రంథమును రచించి పిమ్మట కృష్ణకథారహస్యమనెడియీగ్రంథ మును రచించుచున్నాడు. స్వకవిత్వమందు పరకీయత్వశంకను బోఁగొట్టుటకై, కవితనవంశానుక్రమమును, కావ్యపునామమును కీర్తించియున్నాఁడు, అనుబంధచతుష్టయముగూడ సూచితంబని తెలియవలయును॥

శ్లో॥ సర్వస్వామీతిశౌరావనితరనిహితాభక్తిరేకాస్తి యేషాం।
యేషాం వా నవ్యకావ్యే లలితపదతతిన్యాసరమ్యేస్తిసక్తిః॥
అన్యైరస్పృష్టభావాం సరసతరచమత్కారసూక్తించ యేషాం।
శ్రోతుంవాంఛాస్తి తే తేనిదధతుహృదయే మత్కృతింనిత్యమేతాం॥

తా॥ ఎవరికి శ్రీహరియే సర్వోత్కృష్టుడని ఇతరదేవతాసామాన్యంబుగాని మిక్కిలి భక్తి కలదో, ఎవ్వారికి సరసవచోగుంభితంబైన కావ్యమునందే ఇష్టముకలదో, ఎవ్వరికి ఇతరానుచ్ఛిష్టంబగు నిరతిశయభావబంధురంబులగు సూక్తులను వినుటయందేయాసక్తిగలదో, ఆవ్వారు ఈనాకవిత్వమును డెందంబున భావింతురుగాక॥ అనగ కొందరు భక్తియుక్తంబైన కావ్యంబునే బహూకరింతురు, మరికొందరు నూతనకావ్యమునే గొనియాడెదరు, ఇకకొద్ది జనులు సరసంబగు కావ్యమును వినుటయందె యాసక్తి కలవారుగాన వీనిన న్నింటినొడగూడిన యీకావ్యమునందరును తమతమయభిప్రాయంబులకనుగుణంబుగ గ్రహింపవచ్చునని తాత్పర్యము॥ ఇచట నీకావ్యంబు సర్వగుణోపేతంబని కవియే కంఠతః చెప్పియుండుటను ఆత్మశ్లాఘనారూపదోషంబుగగాక భక్తులగు చదువరులకు దీనిని చదువుటయందు మిక్కిలియాసక్తినిగల్పించుటకని భావించవలయును॥

అవతారిక॥ ఇకకవికథను ప్రారంభించువాడై ఈ పద్యములో కృష్ణజన్మమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ దివ్యాయుధానిచ తథాద్భుత భూషణాని ।
సంబిభ్రదేవనృవపుః కథమావిరాసీః ॥
త్వం వాసుదేవ ఇతి సా పరతాప్యుపేత్య ।
నూనం సమాశ్రయదిహాపి హరేఽధునాత్వామ్ ॥ ౪ ॥

ఓయి! శ్రీహరి! పరమోత్కృష్టత్వసూచకంబులగు సుదర్శనశంఖాదియైనయాయుధంబులను అద్భుతంబులగు కౌస్తుభంబాదియైన యలంకారంబులను, ధరించినవాడగుచునె, ఇట్టి సామాన్యపు మానుషాకృతినెట్లు దాల్చగల్గితివో! యని పూర్వార్థంబున సామాన్యపు ఆశంకచేసి యుత్తరార్థంబున తనంతటనె సమాధానముచేయుచున్నాడు ఓహో! తెలిసెను. ఎచ్చటెచ్చట వాసుదేవత్వంబుండునో యందెల్లెడల బరత్వంబు నియతంబుగాన నీవిపుడును వాసుదేవుడగుటచేత. అనగ (వసుదేవకుమారుడనియు. సమస్తభువనంబులకు నాధారుండనియు) నీయందిపుడును వాసుదేవత్వమున్నదిగాన యాపరత్వమునిన్ను వదలక ఇపుడును అనుసరించివచ్చెనుకాబోలు, అందుచేతనె ఇట్టి దివ్యభూషణంబులను ఆయుధంబులను దాల్చియున్నావు అని అర్థము. ఇచట వసుదేవస్యాపత్యంపుమాన్ వాసుదేవః, వసంత్యస్మిన్ లోకా ఇతి వాసుః వాసుశ్చాసౌదేవశ్చ, యని ద్వివిధవ్యుత్పత్తివైచిత్ర్యమును తెలియవలయును. శ్రీకృష్ణుడు సామాన్యజనులవలెగాక పరమాత్మునియవతారమని భావము ॥

శ్లో॥ క్షీరాబ్ధిమధ్యముపయాయ గతః కుతస్త్వం ।
హే! కృష్ణ! గోకులమహాశిశుభావమేవ ॥
బాల్యేఽహనం సురరిపూన్ రఘునాయకోఽహం ।
క్షీరాబ్ధిః పరోక్షమితి తద్వదిహాద్యతోఽసి ॥ ౫ ॥

తా॥ ఓయికృష్ణ! నీవు చిన్నతనముననె అనగ పుట్టినతోడనె తలిదండ్రులచెంతనిడిచి గోకులంబున కెందుల కేగితివోయని పూర్వార్ధమునప్రశ్న. ఉత్తరార్ధమున సమాధానము. శ్రీరామావతారంబున చిన్నతనంబుననె తలిదండ్రులపరోక్షంబునరక్కసులనుద్రుంచితివిగావున నిపుడుగూడనట్లనె చేయుటకు ప్రారంభించియుందు వేమో! యనియుత్తరార్ధార్థము.

(అవతారిక) ముందరి రెండుశ్లోకముల జేత పూతనాసంహారమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ స్తన్యంప్రదాతుమబలాం సముపాగతాం ప్రాక్ ।
క్షీరం పిబన్ సమవధీర్యదునాథకస్మాత్ ॥
ఆదౌనిహత్యవనితాం రఘునాయకోహం ।
ప్రాపం సదా విజయమిత్యథునాప్యహాన్ కిం ॥ ౬ ॥

తా॥ యదువంశముక్తాఫలంబగునోయి! కృష్ణుడ! పూర్వము దశరథసుతుండవై రాక్షసనాశనాటకంబు ప్రారంభించుటకు పూర్వరంగంబన ప్రారంభమునను స్త్రీనిబరిమార్చినందులచే ఎల్లవుడును జయలక్ష్మిసమకూరెను గాన నిపుడును నట్లనియేగాబోలు పాపము అబలామాత్రముగాక పాలొసంగుట కేతెంచిన పూతనను జక్కగ పాలు ద్రావియు రూపుమాపితివి. అనగ పూర్వము తాటకను జంపిన రాముడును ఇప్పటి కృష్ణుడు ఒక్కడేగానివేరుగాదనుట ఇచట రామావతారచరిత్రము సూచింపబడును ॥ ఉత్ప్రేక్షాలంకారము ॥

శ్లో॥ స్తనేస్యన్యముఖం కృష్ణ! త్వాం కథం పూతనామహాన్ ।
నఖేన హతశస్త్రోస్తె ముఖేనారి వధః తమః ॥ ౭ ॥

తా॥ కృష్ణ! పాలొసగుటకే తెంచిన పూతనపాలిండ్లపై పాలు ద్రావునెపంబున నోరిడి యానోటిచేతనె రాక్షసియగు దానినెట్లు చంపగల్గితివో! యని పూర్వార్ధమున సామాన్యాశంక, ఓహో! తెలిసెను. పూర్వమొకప్పుడంతకంటె యత్యల్పంబులగు గోళ్ళచేతనె వికటాకారుడు మిక్కిలి పరాక్రమశాలియునగు హిరణ్యకశిపువును జంపిన నీకు అబలయగు ఈస్త్రీని నోటిచేతబరిమార్చుట ఆశ్చర్యంబేమియుగాక యుక్తమేయగునని సమాధానము. ఇచట నృసింహావతారమెత్తిన శ్రీహరియే శ్రీకృష్ణుడుగాని వేరుగాదని నృసింహావతారము సూచింపబడునని తెలియవలయును॥

(అవ) మందరిశ్లోకంబులో శకటాసురసంహారమును
వర్ణించుచున్నాడు.

శ్లో॥ చూర్ణీచకర్థ శకటం నికటంగతం త్వం।
డింభత్వ ఏవ బత! దుస్సహచేష్టితోఽసి॥
శ్రీనాథ. పత్త్రరథనాథరథాయమహ్య
మేతన్నరోచత ఇతి వ్యభిచః కిమేవం॥ ౮॥

తా॥ హే శ్రీనాథ! నీవు బాల్యమునందె నీచెంతకే తెంచిన శకటమును (శకటాసురుని, బండినీ) కాలిచేవ్రేల గూలదన్నితివి. అబ్బ! ఓర్వ్వనలవికాని చేష్టలుకలవాడవయ్యెనీవు. సరియే పక్షి ఱేడగు గరుడునిపై సంచరించునాకిది తగినదిగాదని కాబోలు ఇట్లొనరించితివి యని! ఇచట "డింభత్వ ఏవ" యనియు "పత్త్రరథ నాథరథాయ" యనియును చెప్పుటవల్ల అనంతశక్తియుక్తుండగు నా శ్రీహరియే ఇట్లవతరించియుండునని అజ్ఞులగు వారికి తేటబడుచునని తెలియవలయును॥

అవ॥ ఇక అయిదుపద్యములచే పాదాంగుష్ఠచుంబనమును వర్ణించుచున్నాడు.

శ్లో॥ పాదాంగుష్ఠం సతతమపి తే చుంబతో బాలలీలాం।
ఆలోక్యైనం మనసి కలయే కృష్ణమాయాకిశోర॥
ఆక్రమ్యాంఘ్రే! భువనమఖిలం మాం బలేస్స్వాధిదల్లం।
హన్తాఽకార్షీః పునరపి తథా మాచ రేతి బ్రవీషి॥౯॥

తా॥ మాయాకిశోరుడగునోయి కృష్ణ! నీమాయలను దెలియక, నీవు యెల్లపుడును కాలిబొటనవ్రేలిని చిబుకుచుంటవ్, అనేకులు పలువిధంబులుగ చెప్పుచుందురుగాని నామనంబునకీరీతిగదోచుచున్నది. పాదసమీపంబునకు ముఖంబిడి "ఓయి పాదమా! పూర్వమొకప్పుడు నీవు ముల్లోకంబుల నాక్రమించినన్ను బలిచక్రవర్తి వాకలి గాయుపానిగ చేసితివిగాన యికనెప్పటికినారీతిగ చేసినన్ను వేరొక్కరివాకలిగాయువానిగ చేయవలదుసుమా" అని ప్రార్థించుచుందువేమో యని తాత్పర్యము. ఇచట త్రివిక్రమావతారంబున బలిని పాతాళంబున కణద్రొక్కి వాని భక్తికి మెచ్చి తత్ప్రార్థనానుసారంబుగ యెల్లవుడును తన దర్శనమిచ్చుటకై బలియింటి వాకలిగాయుపరంబొసంగిన కథను కని సూచించియున్నాడని తెలయువలయును. శ్రీహరి భక్తిపరాధీనుడని పరమార్థము॥

శ్లో॥ బలినృపతిమివాన్యం భక్తవర్గం పురేవ।
క్వచిదపి నయమా భోః పాదపాతాళలోకం॥
ఇతి కిమాపదసి త్వం పూర్వకృత్యేఽనుతాపాత్।
శరణముపగతానాం రక్షణే దక్షశౌరే॥౧౦॥

తా॥ శరణాగతరక్షణదీక్షితుడగునోయి కృష్ణ! పూర్వము నీవుచేసిన క్రూరపు కార్యమందు చాలపశ్చాత్తాపముగలవాడై నీపాదము నుగురించి ఇట్లు . ఓ చరణమా! పూర్వము భక్తాగ్రేసరుడగు బలి చక్రవర్తిని పాతాళంబునకు బడద్రొక్కితివి పాపమిట్లొక్క భక్తుని నారీతిగ చేయవలదని యుపదేశించుచుండు వెమో॥ ఇచటగూడ వామ నావతారమే సూచింపబడును ॥ భక్తులనిట్లాలాగున చేయవలదని చెప్పునట్లుగ యుత్ప్రేక్షించియుండుటచె శ్రీహరి పరమదయాళువని భావము ॥ ఉత్ప్రేక్షాలంకారము ॥

శ్లో॥ పురేవలోకాన్క్రమణాయనిస్యా ।
దాశాతవాంఘ్రిఘవదనె మదీయె ॥
సందర్శయామ్యత్ర వినాన్యయాన్నాం ।
క్రమస్వలోకానితికిం బ్రవీషి ॥ ౧౧ ॥

తా॥ ఓయిపాదమా! పూర్వము నీవు ముల్లోకంబులనాక్రమించుటకై తగినప్రదేశమును భిక్షించి గ్రుచ్చిరితివి ఇపుడునట్లు ఇచ్చకల్గిన అట్టి ఆయాసంబులేక నాముఖంబుననే సమస్తభువనములనూ జూపెదను సుఖంబుగ నాక్రమింపుమని చెప్పుచున్నావా యేమి॥ ఇచట సమస్త భువనములనూ నోటియందేజూపెదనని చెప్పి యుండుటవల్లనితడావేదప్రతిపాద్యుండగు విరాట్పురుషుడని తెలియ తగ్గది ॥ అలంకారము త్ప్రేక్షమ్ము ॥

శ్లో॥ లాలాజలాసారపరంపరాభిః ।
పదాంబుజం వృష్ణికులేంద్రసించన్ ॥
వసుంధరాయా మపి కామపిత్వాం ।
గంగానదీం స్రష్టుమివాభ్యుద్యతః కిం ॥ ౧౨ ॥

తా॥ ఓయి యాదవాన్వయచంద్రమా! జొల్లుదారలుచేత పాదాంగుష్ఠమును బాగుగ సేవనచేయువాఁడై భూలోకంబున గూడ పతితపావనియగునొక్క గంగానదిని సృష్టింప సమకట్టితివాయేమి! ఆహా యేమినీదీనోద్ధరణశ్రద్ధాళుత్వమనిభావము అలంకారముపూర్వమువలెనె॥

అవ॥ భక్త్యతిశయమున కవిపూర్వము వర్ణనామాత్రమున తృప్తిచాలక ఇకనూ దానినే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ శిలామపి పురాఽకరో శ్చరణపాంసునా స్త్రీనీం।
తత స్త్వయి రహస్యహం ముహురిహ బ్రవీమ్యానతః॥
అనేకశతయౌవతై ర్మమ సదారిరంసార్థినా।
తథా ప్రతిపదం కరోత్విత్తిచ కిన్ను వా యాచసె॥ ౧౩॥

తా॥ ఓయి అంఘ్రుమా! పూర్వమొక్కనాఁడు నీవుగుండ్రాతిని గూడ సుశీలయగునొక్క స్త్రీరత్నంబుగ గావించితివిగాన నేనునీకు నమ్రుడనై మున్మాటికి యేకాంతంబున వేఁడెదనేమన్న నేననేకజవరాండ్రతోఁడి క్రీడలయందాసక్తిగలవాఁడగుటచే ప్రతిపదమునకు నొక్కొక యువతిఁజొప్పున సృజించి నాకు దయపాలింపుమని వేఁడుచున్నావా యేమియని తాత్పర్యము॥ అనఘ। యెవ్వరు వేనినిచ్చుటకు శక్తులుగ యుందురో వారియందు స్వాభీష్టనివేదనంబు సిద్ధించునుగాన ఇట్లు చేయుచున్నావాయని భావము॥ అలంకారము వెనుకటివలెనె తెలియవలయును॥

అవ॥ ఇక శ్లోకత్రయంబుచే ఉదరబంధమును వర్ణించును—

శ్లో॥ బద్ధానాం జగతాంస్థలం త్వహంకృతం కుక్ష్యంతరే శ్రీపతే।
ముక్తిస్థానమిదం పదాంబుజమితి ప్రఖ్యాపయంతీ నృణాం॥

మాతా తేనుతవత్సలాపి పదయోర్బంధం వినైవాఽసకృత్।
త్వచ్చేష్టాసు బబంధ హన్త సుదృఢం దామ్నోదరం కోమలం॥

తా॥ ఓ శ్రీపతి! మిక్కిలి పుత్రవాత్సల్యముకలదయ్యును మీతల్లి, నీవు తుంటతనముచేసినపుడు కాళ్ళనుగట్టివేయక. మృదువైన నీయుదరమును బిగ్గరగ గట్టెనెందులకనగ, సంసారబంధంబునకు దవిలియుండు చతుర్దశభువనంబులకు నీపొట్టయందె స్థలమేర్పరుపబడెను. ఇకముక్తులైనవార్కి నీపాదపద్మంబులయందని ఎల్లరకును తెల్లంబుగావించుటకుయుండువచ్చును ఈరీతిగ గట్టియుండును. లేనిచో గట్టివేయుటన్న లోకంబున పాదంబులకే యని రూఢియుండగ తద్వ్యతిరేకముగ నెందులకొనర్చెను! ఇచట భగవంతుని నాశ్రయించుభక్తులకు నిత్యమైన ముక్తి లభించునుగాన అందరును తత్పాదంబులనే ఆశ్రయించవలసినదని భావము। ఆలంకారము పూర్వము వలెన॥

శ్లో॥ అస్యైవనాభౌ కమలం సనాళం।
పురోదభూదద్యయదిప్రరోహేత్॥
పీడాభవేదిత్యుదరం కిమేషా।
చేష్టోపరోధచ్ఛలతోబబంధ॥ ౧౧॥

తా॥ కృష్ణ! నీవు ఎల్లపుడును తుంటపనులను చేయుచుండువుగాన నిన్నుగట్టవేయవలయునను నెపంబుచేత ,,ఈతనినాభియందె పూర్వము కంటకయుక్తంబైన తామరతూడతోకూడినట్టి కమలముదయించియుండెను, ఆకమలపుగడ్డ యిపుడుగూడ అంకురించినచో యీనాపాపనకి మిక్కిలిపొట్ట శూలగల్గునుగాన దానినాపవలయును" అని మీతల్లియగు యశోదనీయుదరమును బంధించెననియుత్ప్రేక్షణ

మును గావించియున్నాడు. ఇచట ,, అస్యైవనాభౌ '' యని చెప్పుట చేత ఇతడు సృష్టికర్తయగు బ్రహ్మదేవునికిగూడనుత్పత్తిస్థానంబగు విరాట్ పురుషుడని భావము సూచితంబగును ॥

అవ ॥ అథవా ఈరీతిగయుండవచ్చునని ప్రకారాంతరంబుగ వెనుకటయంశమునేయుత్ప్రేక్షించుచున్నాడు—

శ్లో ॥ తనువలగ్నజుషా శిశునోదరే ।
కథమహోఽద్రియతేఽఖిలవిష్టపం ॥
ఇతి భయాకులయా తు యశోదయా ।
జఠరబంధనమాచరితం ధ్రువం ॥ ౧౬ ॥

తా ॥ చాలసన్నమైన నడుముగల యీతడు తన కడుపునందే సమస్తబ్రహ్మాండంబును నెట్లు తానె భరింపగలడో యని యశోద చాల భయంబంది గట్టిగనిల్చుటకై బిగ్గరగ నీయుదరమును బంధించి యుండును కాబోలు యని తాత్పర్యము ॥ అనగ ॥ లోకములో చాల బరువు మోయువారు నడుముక్రుంగక శక్తి హెచ్చుటకై నడుమును బిగ్గరగ గట్టుటవాడికగాన నామెయు గూడనట్లె గావించియుండునని యుత్ప్రేక్షణముగావించియున్నాడు ॥

అవతారిక ॥ ఇక యమళార్జునభంజనమును శ్లోకచతుష్టయంబుచె వర్ణించుచున్నాడు.

శ్లో ॥ సుగ్రీవవిస్రమ్భకృతే రమేశో
న్యపాతయస్త్వం కిల సప్తసాలాన్ ।
అద్యాపి తద్వాసనయైవ సాల
యుగ్మం వ్యభాంక్షీశ్శిశులీలయైవ ॥ ౧౭ ॥

తా॥ ఓ బలలక్ష్మీపతి! పూర్వమొక్కనాడు నీవు "ఇతడు వాలిని భరించుటకు వంతటి శక్తివంతుడగునా కాదా!" అను సుగ్రీవుని యొక్క సంశయంబుతొలగించి నిశ్చయముగ రుజువుటకై ఏడు సాల వృక్షముల నొక్కపెట్టున నేలగూల్చితివి, నేడుకూడ అదేసంస్కారము చేత నేయుండవచ్చును భాల్యావు యీ టలచేత నె యీ రెండుసాలవృక్షములను బడదన్నితివని తాత్పర్యము, ఇచ్చట రామావతారము సూచితంబగును. పూర్వవదలఙ్కారః.'

శ్లో॥ వటపత్రమేవ శయనాయ జాయతే
ప్రళయేషు తేషు జలధౌ సమప్రియమ్।
అమునార్జునద్రుయుగళేన కిం ఫలం
భవతీతినూనమభినశ్విశోఽథవా ॥ ౧౮ ॥

తా॥ ఓయి, చిన్నికృష్ణ! ప్రళయకాలంబులందు నాకు సముద్రంబునపరుండుటకు పాన్పుగ వటపత్రమె ప్రియమైయుండగ యీ రెండుసాలవృక్షములతో నాకేలాటిప్రయోజనమున్న లేదని వాటిని గూలదన్నితివి ఇది నిజమె లేనిచో కారణమేమియును లేదుకదాయని తాత్పర్యము॥—ఇచ్చట ప్రలయకాలంబున సమస్తప్రాణికోటులు నాశమొందినను ఇతడుమాత్రమునశింపక వాటికన్నిటకిని సాక్షిభూతుడుగయుండు పురాణపురుషుడని భక్తిభావము తోచుచుండును॥

శ్లో॥ యాచిష్యమాణం ప్రియయా సుభాషాం।
తరుం తదానీం తరసైవలప్స్యే॥
కిమర్జునానోకహతః ఫలంస్యా।
దితివ్యభాంక్షీః కిమునన్దసూనో॥ ౧౯ ॥

తా॥ అథవా, ఇక ముందుతన ప్రియురాలిచె యాచింపబడు తరువు దేవలోకంబుననుండు కల్పవృక్షంబులలోనొక్కటైన పారిజాత

ము.గాని ఇదిగాదు. అట్టిదానినిగూడ నొక్కక్షణమాత్రమున నే దె చ్చెదను. ఇక యీసాలచెట్లచెనేమిప్రయోజనమున్నది! ఏమియు లేదని కాభోలు వాటిని నిమూర్ణాలింప జేసితివని తాత్పర్యము ॥ ఇచ్చట ముందు జేయబోవు కార్యంబుగూడ నుత్ప్రేక్షామూలంబున సూచించి యున్నాడు ॥

శ్లో ॥ త్వమర్జునం రక్షితుమేవకాఙ్క్ష
న్యదాऽభవ స్తత్పరిభఙ్గనేచ్ఛుః ।
తదాపురాణం భృగునన్దనత్వం
త్వయ్యావిరాసీ దితినిశ్చినోమి ॥ ౨౦ ॥

తా ॥ కృష్ణా! నీవు అర్జునుని సంరక్షణమునె కోరువాడై నను తద్విరోధ బుగనర్జున (సాలవృక్ష) నాశంబొనర్చునపుడు బహుశః వెనుకటిజన్మపుపరశురామునిభావము నీయందుబొడగట్టియుండవచ్చు ను లేనిచో విరుద్ధంబగుపని నేల చెయుదువు ? । చేయవనితాత్పర్యము ॥ ఇచ్చట అర్జునశబ్దంబునకు పాండురాజపుత్రుడనియు సాలచెట్లనియు కార్తవీర్యార్జునుడనియును అర్థములను జెప్పి విరోధపరిహారమొనర్చ వలయు । ఇచ్చట పరశురామావతారమందు తండ్రియొక్క హోమ ధేనువును కార్తవీర్యార్జునుడు గొంపోవగకోపంబుచే పరశురాము డువానిని సంహారించెనను పురాణపుకథను తెలియతగ్గది.

అవతారిక ॥ ఒకశ్లోకముచే మృద్భక్షణమ్మును వర్ణించుచు న్నాడు ॥—

శ్లో ॥ క్షేప్తుం హితా మృత్స్నం ముఖతో ము.రారే
ర్లీలాం తవై తా మవలోక్యమాతా ।
నివారయామాస వృథాముహుస్సా
నవేకనూనం కిటిచేష్టితం త్వామ్ ॥ ౨౧ ॥

తా॥ ఓయి మురసంహారుడ! నీవు నోటియందు మన్నుంచుకొని తినునపుడెన్నోసారులు వ్యర్థముగ యశోద దానినాపెనుగాని నీవు పందిచేష్టలుగలవాడవని పాప మాయమ్మయెరుంగకపోయెను. అనగ నీవు వెనుక పందిరూపమును దాల్చినపుడు, నోటిచే మంటిని పెల్లగించుచుండినందున ఇపుడుగూడ నోటియందు మన్నుంచుకొనుచున్నావని భావము.—ఇచట "ముఖతః" యనుటచే నోటియందనియు నోటిచేతననియు సప్తమీతృతీయార్థములు బోధింపబడును. కృష్ణపరార్థమందు సప్తమియు వరాహార్థంబునందు తృతీయయును ఉపయోగించవలయు॥—

(అవతారికా) ఇక శ్లోకపంచకముచేత పాలుపెరుగువెన్నలను దొంగిలించుటను వర్ణించుచున్నాడు.

శ్లో॥ నందాన్వయేంద్ర తవ గోకులమందిరేషు ।
క్షీరం విలుంఠ్య బహుశః పిబతోఽపి శశ్వత్ ॥
తృష్ణాయతో న విరరామ తతోఽత్ర శంకే ।
నాఽఽద్యావతారయుగళేష్వపిబః పయాంసి ॥ ౨౨ ॥

ఓ, నందసూనుడ! గొల్లలయిండ్లలో పాలుదొంగిలించిపలుమారుద్రావినను నీకుతనివితీరకుండుటజూడ వెనుక నీవు మొదటిరెండవతారంబులను అనగ (మత్స్యకూర్మరూపంబులను) దాల్చినపుడు పాలుద్రావియేయుండలేదని కాబోలు ఇపుడు ఇన్నిపాలుత్రాగుచున్నావని నేనూహించెదను. ప్రాణిసామాన్యంబువలెనెగాక మత్స్యకూర్మంబులకు పాలులేకుండుటలోకసిద్ధము.

శ్లో॥ నాభౌ నిగూఢకమలాంకురోమే ।
పునర్జగత్సృష్టివిహారకాలే ।

సమ్యక్ప్రరోహత్వితివాధునైవ।

పయః పిబన్ సించసి కిం స్వకుక్షౌ॥ ౨౩॥

తా॥ లేక ఇన్నిపాలుద్రాగుటకు కారణమిట్లేమైనయుండ వచ్చును, యేమన—,, రహస్యముగ నా బొగ్గిలియందుదాగియుండు, తామర మొలక తిరిగి ప్రపంచమును సృష్టించు వేళకు బాగుగ పెరగ వలెను ” అని ఇపుడు పొట్టలో పయస్సేచనమును బాగుగగావించు చుందువేమో? ఇచటపయస్సనగ పాలనియు, నీళ్ళనియును అర్థము. చెట్లను బెంచువారు, పాతులయందునీరుబోయుటసహజమేగాన, పొట్ట యనెడుపాతిలో, కమలపు మొలకనుపాతియుండుటచే, కృష్ణుడుగూడ నట్లేచేయుచుండుననియు త్ప్రేక్షణముగావించియున్నాడు; అనగ పద్మ నాభుడనియితని కే పేరనిస్పష్టమగును.

శ్లో॥ అథవాఽత్మముఖే౽భిదర్శితానాం
నిఖిలానాంజగతాంచపోషణాయ।
బహుధాపరిభర్త్సితోఽపిగోపైః
పిబసిత్వంప్రతిమందిరంచ దుగ్ధం॥ ౨౪॥

తా॥ అథవానీనోటియందు జూపబడిన సమస్తలోకంబులను గాపాడుటకై యుండవచ్చును గొల్లలెందరెన్నివిధముల బెదరించినను విడవక దొంగిలించి అన్నిపాలుద్రాగితివి. అనగ గొప్పసంసారియైన వాడు యేరీతిసనేగాని ఎవరేమన్నను ఆసంసారమునుగాపాడియే తీరవలయునో, అట్లే చతుర్దశలోకంబులను కుక్షియందుంచుకొని యుండుటవల్ల అందుండుప్రజలనుగాపాడుటకు కృష్ణుడుగూడ ఇట్లు జేసెనని యుత్ప్రేక్షణము.

శ్లో॥ బహుధానవనీతమాప్యఖాదన్
సహితృప్తోఽభవఏవ కృష్ణకస్మాత్ ॥
కరుణార్ద్రహృదానుతోలనార్థం
భవితవ్యంకియదిత్యపూరయః కిం ॥ ౨౫ ॥

తా॥ కృష్ణ! యెంతో వెన్న దొంగిలించితివినను యెందువల్ల నీకుతనివిదీర లేదు ? ప్రాయశః ఇట్లుండవచ్చును ,, జాలిచేత మృదుశీతలంబగు నాయంతఃకరణము హృదయకుహరమునన్నది దానితో కూడ తూకముచేసి సరిపోల్చవలసినయెంత వెన్న గావలయునో జూతమంచుపొట్టయనడిసంచియందునింపుచుందువా యేమి?" అనగ శ్రీకృష్ణపరమాత్మడు నవనీతంబునకంటె మృదుమధురశీతలంబు కృపాపరిపూర్ణంబైనచిత్తముకలవాడనిభావము,

శ్లో॥ లుంఠిత్వాదధిదుగ్ధమన్యసదనేష్వాలోలనేత్రఃపిబన్ ।
గోపీషుగ్రహణార్థమాగతవతీష్వప్రాప్తగత్యంతరః ॥
సంకోచ్యాథనిజాంగకానినిభృతస్తత్రైవనాలక్ష్యథాః ।
కూర్మాకారభృతాత్వయాఖలుపురాసంశిక్షితోయంక్రమః॥

తా॥ ఓరి! చిన్నికృష్ణ, నీవు గొల్లలిండ్లలో పాలు మొదలైన వాటిని దొంగలించి అటునిటు బిత్తరుపుచూపులతో జూచుచు పాలు పెరుగులనుద్రాగుచుండునపుడు గోపవణతులునిన్ను బట్టుటకే తెంచగ వేరొక్క యుపాయముగానక శరీరమును సంకోచబరచి కదలక మెదలకచ్చుటనేగాన రాకుండుటను నీవుతాబేలురూపమును పొందియున్నపుడు అభ్యాసముచేసియుంటివా యేమి? అనగ జనులు తన్ను బట్టుటకేతెంచినపుడు తనశరీరమును లోపలికీడ్చి సంకోచబరచుట తాబేలు స్వభావముగాన కృష్ణుడేతాబేలు జన్మమందియుండెనుగాన అట్టి యభ్యాసమేయుండవచ్చునని యుత్ప్రేక్షణము.

శ్లో ॥ సర్వేశ్వరస్యతవసర్వవిదఃకథంవా ।
జాతాస్సఖాయఇహబాలిశగోపబాలాః ॥
సుగ్రీవముఖ్యకపిసఖ్యమపిప్రకల్ప్య ।
క్రీడాంవిధాతురథవాతవతేఽనురూపాః ॥ ౨౮॥

తా॥ ఓముకుంద ! పరాత్పరుడవు సర్వజ్ఞుడవగునీకు ఆచపలు గోపబాలకులు చెలికాండ్రుగ నెట్లయిరో ? అథవా సుగ్రీవుడు మొదలయిన వానరులతో చెలిమిం జేసి క్రీడింపగ సమకట్టిన నీకు ఈ యజ్ఞులగు గోపబాలకులు స్నేహితులగుట యుక్తమేయగును. ఇచ్చట పరమాత్ముడు మిక్కిలి సులభుడ వెల్లడనగును.

( అవతారికా ) ఇక నాల్గుశ్లోకములచేత కాళీయమర్దనము వర్ణింపబడును.

శ్లో ॥ దృష్ట్వాహ్రదేఫణినమాశునిపత్యతస్య
భోగావృతస్సునిభృతశ్చనిమీలితాక్షః ।
మధ్యేఽబ్ధిభోగినికృతాంనిజయోగనిద్రాం
స్పష్టీచకర్థనుహృదస్తవబిభ్యురజ్ఞాః ॥ ౨౯॥

తా ॥ కృష్ణ ! నీవు మడువునందు పెనుబాము నుజూచి పైబడి తదీయ దీర్ఘకాయముచే నావరింప బడికన్నుల దోట్చి నిశ్చంచలంబుగ యుండుటవల్ల క్షీరసముద్రంబునందు శేషాహి పైగావించడు యోగనిద్రను తేటపరచితివి. దీనిగాంచి మూఢులగు నీచలికాండ్రు భయము జెందుచుండిరి. అనగ కాళీయ మడువులో నీశ్శయందు గొప్పపాముని జూచినతోడనె కృష్ణునికి సంస్కారము ద్బుద్ధముజెంది సముద్రమున శేషశయనము జ్ఞాపకమునకు వచ్చి ఆ

రీతిగ గావించెనని కవియుత్ప్రేక్షించియున్నాడు. సదృశవస్తుదర్శనము సంస్కారోద్బోధక మగుట న్యాయానుభవసిద్ధము.

శ్లో॥ కాళీయమర్దనవిధౌ తవ కోపహేతు
ర్జ్ఞాతః పురా పురహరస్య శరో యదాఽభూః ।
మౌర్వీకృతేన భుజగేన తదాసు దూరం
నిష్కాసితోఽహమితి తం తుదసీహ శౌరే ॥ ౨౯॥

తా॥ ఓహో శౌరే! కాళీయుని బరిమార్చు నంతటి కోపమునకు జాలినంతటి కారణమును బొడగంటిమి. పూర్వము త్రిపుర సంహార కాలంబులో, ఈశ్వరునికి బాణంబయిన నన్ను అల్లిత్రాడుగ జేయబడిన ఈ సర్పపు జాతివాడే చాలాదూరము త్రోసెనను మాత్సర్యముచే ఇపుడు పామును మర్దించుచున్నావేమో? ఇచట త్రిపురసంహార కాలంబులో, పరమేశ్వరుడు భూమిని తేరుగను. వేదములను రథ్యంబులుగను, సముద్రుని అంబులు పొదగను, మేరువును విల్లుగను, వాసుకిని అల్లిత్రాడుగను, విష్ణుని బాణముగను జేసివాటిని సంహరించెనని పురాణకథ.—

శ్లో॥ అథవేంద్రజితాప్రయుక్తమస్త్రం
భుజగో రామతనోః ప్రకల్ప్య మూర్ఛాం ।
మమ శౌర్యయశోజహార హంతే
త్యతిరోషాత్తుదసీహ తం భుజంగం ॥౩౦॥

తా॥ అథవా ఇట్లుండవచ్చును (యేమన) పూర్వము, ఇంద్రజితుడు బరగించిన మాత్రముననే ఈ సర్పములు రామావతారంబు దాల్చిన నన్ను మూర్ఛనొంద జేసి నిరతిశయ పరాక్రమసర్థితంబగు

నాదుయశంబునకు కళంకమ్మును పుట్టించునుగాన నిపుడు వీనిగర్వమ డంచిదీరవలెనని ఈలాగు గావించుచుందువూ !

శ్లో ॥ సంత్రాసితౌత్వయాద్వౌ
తిర్యంచౌప్రాక్తనస్తుసంత్రాతౌ ।
రఘుపతినైకఃకాకః
పరస్తుకాకోదరోఽద్యయదుపతినా ॥౩౧॥

తా ॥ హేముకుంద ! రెండుతిర్యక్ప్రాణులు నీకు గొప్ప యొప్పమిని గలుగజేసి నీచేకడుడస్సి కాపాడువారిని, వేరొకరిగాన పిమ్మట శరణుజొచ్చి నీచేతనే గాపాడబడెను. అవియేవన, శ్రీరామావతారంబున చిత్రకూటమందు నీచుండగు నొక్క కాకాసురుడు, ఇపుడు ఈ కాళీయ నామకుండగు కాకోదరుండు. అనగ (పాము) వేరొకండు.

శ్లో ॥ ఇంద్రంసమారాధయితుంప్రవృత్తాన్
నివార్యగోవర్ధనమంచతేతి ।
ఉక్త్వాతదాత్మాఽభవఏవసాల
గ్రామోపలస్యార్యతవైషధర్మః ॥౩౨॥

తా ॥ హేస్వామిన్, ఎప్పటి యలవాటుజొప్పున దేవేంద్రు నారాధించుట కారంభించిన గోపాలుల నడ్డగించి "ఇంద్రునితో మనకెట్టి ప్రయోజనము లేదు; మనకును, మనగోవులకును గావలిసినంత తృణజలఫలంబుల నొసంగు గోవర్ధనమునే బూజింపవలయు "నని ప్రేరేపించితదాకారమునే దాల్చియూ పూజను నీవేగైకొంటివి; ఇది సాలగ్రామశిలాస్వరూపుండగు నీకు యుక్తమేయగును.

(అవతారిక) సుందరిశ్లోకద్వయములో గోవర్ధనోద్ధరణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ దేవేంద్రేకుపితేఽఘనవర్షితభాజిలోకేఽపిశోకాకులే ।
సర్వజ్ఞోప్యవిదన్నుపాయమపరం క్షాంతింవినాలీలయా॥
యద్గోవర్ధనపర్వతంసువహస్తత్రాస్తిశౌరేమహః ।
నభ్యాసస్తవమందరక్షితిధరంధృత్వాసమాసాదితః ॥33॥

తా॥ నిజపూజనాపినందులకు దేవేంద్రుడు కోపగించి విపరీతమ్ముగ వర్షింపగ జనులెల్ల కడుశోకంబంద నీవుసర్వమును దెలిసినవాడయ్యు దానినాపుటకు వేరొండుపాయంబుగానని వానివలె నటించి పెల్లుబ్బిన యాగోవర్ధనమ్మునే పెల్లగించి వహించితివనుట సముద్రమథన కాలంబున, కులపర్వతంబులందొక్కటియగు మందరాద్రిని మూపునమోసి కొండలను మోయుయభ్యాసము చేసిన నీకిదియొక ఘనకార్యమ్ముగాదుసుమా ॥

శ్లో॥ ఉతాహోరామత్వేదశవదననీతాంస్వదయితాం ।
సమానేతుంసేతుంజలనిధిజలేకర్తుమనసః ॥
మహార్ణశైలాఅప్యుపరిసలిలస్యోత్ప్లవనత ।
స్సహాయాణిత్యేవంగిరిమిహసముద్ధృత్యవహసి ॥3౪॥

తా॥ లేనిచో రామావతారంబున రావణాపహృతయై లంకయందిడబడిన సీతను దెచ్చుటకు బోవునపుడు సముద్రుని పైవంతెన గట్టుటకిచ్చగించిననాడు పర్వతంబులన్నియు నీటియందు తేలాడుచు జలగమనంబున కుచాలతోట్టడెసను ప్రీతిచే తజ్జాతీయుంబైన నీపర్వతంబున సంతోషకృతజ్ఞతలను జూపుటకై వహించియుండవచ్చును.

శ్లో॥ గోపాలనం బహుమతం విపినాంతరేయత్
యుక్తం కిమార్య తవ సర్వజగన్నియంతుః ।
అస్యావతారవిభవస్య నిదానమాసీత్
గోరూపమేవధరణేరితి వాప్రియాస్తాః ॥౩౫॥

తా॥ హేపురాణపురుష ! నిఖిలజగంబులను నియమించునట్టి నీకు కానన సీమలయందు గ్రుమ్మరుచు ఆవులంగాయుటయుక్తమగున లేకున్న ఈరీతిగయుండవచ్చును నీ శ్రీకృష్ణావతార వైభవంబును బొందుటకుపుడమియొక్క గోరూపమే కారణంబగుటవలన ఆ క్రేపులు నీకింత ప్రియంబులుగయుండవచ్చును ఇచ్చట దుర్యోధన కంసాదులవలని దుష్టభారంబు మోయుటకు చేతకాక భూదేవి గోరూపమున్ దాల్చియా పరమాత్మ్మని చెంతజెట్టిన మొరలం వినియాదుష్టులను శిక్షించినాడని పురాణకథను దెలియవలయును.

శ్లో॥ జటాంకృత్వాక్షీరై ర్వటతరుభవైః కాననతలే ।
విహర్తుస్సౌందర్యంవదననళినేరాఘవతనోః ॥
తవాసీత్ప్రీత్యాంతద్ద్విగుణమధునాగోఖురభవైః ।
రజోభిస్సంకీర్ణా లులితచికురే వక్త్రశశిని ॥౩౬॥

తా॥ హేముకుంద ! శ్రీరామావతారంబున కానన సీమలందు మర్రిమ్రాని పాలుచేత వెంట్రుకలను జడలుగజేసి విహరించుచున్న నీముఖమందలియే చక్కదనము అవశ్యముగ జూడదెగినదిగాయుండెను. అదేసౌందర్యమిప్పుడు కదుపులగిట్టల త్రొక్కుడుచే గల్గిన ధూళిచే ధూసరంబై కొంచముగనల్లాడుచుండు ముంగిరులచే నలంకరించబడిన చంద్రుని వంటిముఖమందు రెట్టింపుగగాన్పట్టుచు

న్నది. అనగ రామావతారంబున మఱ్ఱిపాలుచేత వెండ్రుకలు జడ గట్టియున్నను ఇవుడు ధూళిచే అవృతంబై యున్నను కాంతిని హెచ్చించుచునేయుండుటవల్ల సహజముగలావణ్యవంతుడైన పరమాత్మునకు వీనిచేనైనను కాంతిభంగము కలుగక మరింత యుపకారకమగునని సగుణోపాసకులకు భక్త్యతిశయంబునకై పరమాత్మునియందలి అనన్య లావణ్యంబును కవి ప్రకటించియున్నాడు కాళిదాసుగూడ శకుంతలనిట్లు వర్ణించియున్నాడు::సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం" యని

శ్లో ॥ కిమర్థంకాన్తారేయదుకులమణేపర్యటసివా ।
కుతస్త్వస్మిన్ వేణుంమధురమధురంవాదయసిచ ॥
పురానూంరామత్వేహరిణహతకోఽవంచయదితి ।
ప్రతాన్వైర్తాన్ హంతుంవిపినభువినూనంప్రయతసే॥32

తా ॥ హేయదువంశరత్నమా ! నీవెందులకడవియందు సంచరించుచుమనోహరంబుగ పిల్లగ్రోవినివాయించుచున్నావనదెలిసెను పూర్వము రామావతారంబున నీచంబగు ఏణములునన్ను అడవియందే మోసబుచ్చెనుగాన వీనినిప్పుడీయడవియందే వంచించి చంప ప్రయత్నించుచున్నావు గాబోలు అనగ హరిణములు మనోహరమైన వేణుగానమునకు వశమగుటప్రసిద్ధంబుగాన నీతని వేణుగానంబుచే తిర్యక్ప్రాణిలుగూడ ఆనందసాగరమందుమునంగియుండునని పరమాత్ముని వేణువాదన కౌశల్యంబునితర సాధారణంబని భక్తిభావము సూచింపబడును.

శ్లో ॥ నీరక్రీడాచపలలలనాసంఘవిన్యస్తనానా ।
కౌశేయానామపహరణతో వేద్మితేభావబంధం ॥

క్రందిష్యంత్యా ద్రుపదదుహితుర్దా తుమన్వాయతాని।
ప్రాక్సంనద్ధః కిలసమభవ ప్రాభక్తసంత్రాణదీక్షః ॥౩౮॥

తా ॥ కృష్ణ ! జలక్రీడలందా సక్తులగు గోపికల గుంపుచేత గడ్డనుంచబడిన పీతాంబరములను అపహరించుటయందు నీయభిప్రాయమేమని తెలిసెను ఇకముందు దుశ్శాసనునిచేత జేయబడు వస్త్రాపహరణకాలంబున మొరవెట్టెడు ద్రౌపదికి వేగమే వాటిని యడతెగక నిచ్చుటకై యున్నందుగ భక్తార్తిభంజనదీక్షితుడవగు నీవు సజ్జుండ వై యుందువుగద ? ఇచ్చట శ్రీకృష్ణపరమాత్ముడు నిజభక్తులకు ఇకమ్ముందు రాబోవు యాపదలనుగూడ తొలగించుటకు మున్నుందుగనే వలయునంతటి పరికరంబులచే సంసిద్ధుండనియాతనియపరిమితభక్తత్రాణపట్టుదలస్పష్టమగును.

శ్లో ॥ కాళిందీనీరపూరేనిజతనురుచిభిఃపోషయ న్కాళిమానం ।
విద్యుద్వర్ణాంగభాభిర్యువతిభిరభితస్సంవృతస్త్వంమురారే ।
మాం యా జ్ఞాత్వాంఽబుమగ్నంస్పృశతిచచతురాతద్వశోఽహంభవామీ ।
త్యుక్త్వాతాః ఖేదయన్సన్ జలచరచరితం ప్రాక్తనం కిన్వకార్షీః ॥

తా ॥ హేమురహర ! యమునాప్రవాహంబున స్వీయదేహకాంతులచే నీటియందలి నైల్యమును హెచ్చించుచు మెరపుతీగెలవంటి శరీరపుమిసిమిగల జవరాండ్రచేత నీవు ఆవరింపబడి “ నీటియందు మునిగిననన్ను కనిపెట్టెడే చతురరాలగు పణతిముట్టునో యాస్త్రీకి నేను వశుండ ” ని బురిగొల్పివారిని చాల ఆయాసమందజేసి వెనుకటి నీమత్స్యకూర్మచరిత్రను వెల్లడించితివి గాబోలు—ఇచట ,,నిజ

తనురుచిభిః కాళిమానంపోషయః " ః విద్యుద్వర్ణాంగభాభిర్వ్యవ తిభిః " యని కృష్ణునియందలి నైల్యమును యువతులవిద్యుత్సామ్య మును ప్రతిపాదించియుండుటచేత నీటియందు మునుగిన కృష్ణునికిని యమునానీటికిని భేదము తెలియకుండుటచే ఆపణతులకు వారిఁబ ట్టుట చాలకష్టమాయను ఇతనికి వారిఁ దెలిసి తప్పించుకొనుటకు మిక్కిలి సౌకర్యముగ యుండెనని తోపింపజేయుటకై పైవిశేష ణంబులో సంగబడియుండును.

శ్లో ॥ త్వంభోగాః ప్రణయాత్మక స్త్వమథవా ప్రాణా స్త్వమేవేతియాః ।
కాంతారేసుదృశో౽న్వగుః ప్రియతమాస్త్వామేవమత్వాగతిం ॥
తాస్సర్వా అపివంచయః బతతథాశౌరేతిరోభూః కథం ।
రామత్వేత్వనుయాః తికాః నిశివనే తేముంచతస్సాధుతత్ ॥౪౦॥

తా ॥ హేశౌరీ, నీవే సమస్తభోగంబులు నీవే ప్రణయ స్వరూపుడవు ఏ౯తైన జప్పనేలనీవే ప్రాణంబులనియెంచి మిక్కిలియ నురాగంబుగల ఏకామినులు నీవే దిక్కని యడవియందు నిన్నే యను సరించిరో పాపము ! అట్టివారందరినిగూడ వంచించియట్లుగాన రాక యుంటివయ్యా ? అథవా రామావతారంబున పిత్రాజ్ఞననుసరించి యడవికి బోవు నిన్నెడబాయలేక నీవే దిక్కని గొంతదూరమనుసరిం చిన పౌరులందరు రాతిరి అడవియందు నిదురించుచుండఁవారిఁ వం చించి అడవికిఁ జనిన నీకిదియుక్తమే

శ్లో ॥ నూనంకువలయాపీడంకరీంద్రంహంతుముద్యతః ।
అద్యాపిసింహగంధంతంనముంచసిచిరంతనం ॥౪౧॥

తా ॥ కృష్ణ కంసునింటనిను దూకొనుట కేతెంచిన కువలయా పీడమను గజరాజమును ఒరిమూర్చుటకు నుద్యుక్తుడైన నీవు నేటికిఁగూడ ఆ బహుకాలపునాటి సింహపు వాసనను నిజముగ విడవ లేదని తోఁచుచున్నది.

ఇచట నృసింహావతారము సూచింపబడును.

(అవతారికా) ఈ మీంద రెండుశ్లోకములచే కవి కంసవధను వర్ణించుచున్నాడు.

శ్లో ॥ కంసంతథాఽత్మబంధు
స్వయమేవకథంరమేశనమవ్యంస్త్వం ।
మాతుర్హంతాత్వమభూః
మాతులహంతాఽద్యహంతతేచేష్టా ॥౮౨॥

తా ॥ ఓయి లక్ష్మీశ ! చాలదగ్గిరి బంధువగు కంసుని, మేనల్లుడవైన నీవే చేతులార నెట్లు జంపితివో ? ఏమి నీచేష్టలయ్యా ? వెనుకనొక్కప్పుడు తల్లిని జంపియుంటివి అట్టి సంస్కారము చేతనే ఇపుడు తల్లితో బుట్టును (మేనమామను) జంపితివి. (వెనక పరశురామావతారంబున పితాజ్ఞచేత తనతల్లిని సంహరించెనని పురాణకథా)

శ్లో ॥ కంసంహంతుంప్రహరణమనాదృత్యతస్యోపరిష్టా
న్నిష్పత్యావాసునిపుణభవాన్త్రకోప్యస్తిహేతుః ।
ప్రాగ్లంకేశోముహురపిమయాచ్ఛిన్నకంఠోఽపిబాహ్యైః
ఉద్యన్మూర్ధాఽభవదయమరిస్తాదృగిత్యస్తితేధీః ॥౮౩

తా ॥ ఓ చతురుడైన కృష్ణ ! కంసుని జంపుటకు, ఎట్టి యాయుధములైన లెక్కించక వానిపై బడి జంపితివిగదా ? ఇందుల కేమి

కారము ? „ వెనుక రావణుడు బాణములచేత మాటిమాటికి నా చే కంఠము ద్రెగ వేయబడిచిన వాడయ్యును ఎడ తెగక బుట్టు శిరంబులు కలుగువాడే ఆయెను ఇతడుగూడ అట్టివాడే ”యను బుద్ధియే సీకున్నదాయేమి ?

శ్లో ॥ ప్రీతిఃపరాపకకుతో యదునాథవహ్నా
యత్ఖాండవాశితురముష్యచకర్థసాహ్యం ।
అత్రాస్తి హేతురథవాతవరాఘవత్వే
పత్నీంరక్షసపిలాత్మశిఖాంప్రవిష్టాం ॥౪౪॥

తా ॥ ఓయి యదునాథ నానావిధ జంతు సంతానములకాకరంబైన యా ఖాండవ వనమును దహించు నగ్నికి చాల సహాయమ్ముఁ జేసి వానియందత్యుత్కృష్టంబైన ప్రీతిజూపుటకు కారణమును నీవు రాఘవత్వమ్ముఁ దాల్చినపుడునగ్ని స్వాశ్రయంబుఁగూడ దహించు స్వభావంబుగలవాడయ్యును తనశిఖలఁ జొచ్చిన నీప్రియపత్నిని గాపాడెననుటయే యుండవచ్చును. ఇచట ఎవ్వరైనను కొంచము పకారము పరమాత్మునకు చేసియున్నను కొట్టింపగు ప్రతిఫలంబును యాతనివల్ల బొందగల్గుదురని యాతని పరోపకారపరతంత్రత్వము సూచింపబడును.

శ్లో ॥ జరాసంధాద్భీతో ముహురపిభవాన్ప్రాద్రవదహో
భయే హేతుఃకస్తే సకలజగదుద్గీతయశసః ॥
అనేకస్త్రీసంఘప్రణయరసపాత్రే వపుషి తే ।
జరాసంధోద్వేగంకిమపరిహార్య కృష్ణనిరగాః ॥౪౫॥

తా ॥ ఓయి కృష్ణ జరాసంధునివల్ల భీతుండవై పలుమారులు నీవు పలాయనమ్ముఁ గావించితివి సకలలోకంబులచే శ్లాఘింపఁబడిన యశస్సుగల నీకు (?) — సకలలోకంబులచే జేగీయమానయ

శుండపగు నీవు భయంబొందుటకు గారణమేమైయుండువచ్చును ? అథవా చాలామంది స్త్రీసముదాయపు అనురాగరసంబు నకునీకి పట్టైననీ కాయంబున ( జరాసంధో ద్వేగం ) ముసలితనపు సంబంధభయమును దొలగించుటకై పరుగిడితివిగాబోలు ఇచట “ జరాసంధ ” యనుపదమునకు రెండువిధంబులగు వ్యుత్పత్తి జరాసంధుడని పేరొకటి ముసలితనపు సంబాధమని యొకటి.

శ్లో ॥ శ్రీకృష్ణత్వత్కటాక్షో ద్రుపదనృపసుతావల్లభేష్వస్తి భూయాన్
తత్రాప్యస్మిన్ నితాంతం ప్రచురఇతిమతః ఫల్గునే పక్షపాతః ।
సాహ్యాంతస్సైన్యవనిత్యంయుధిసమరచయో యత్ర వోపేంద్రతాయా
స్సంబంధాదింద్రజేఽస్మిన్ సమభవదతులా ప్రీతిరేతన్న చిత్రం ॥

తా ॥ ఓయి శ్రీకృష్ణుడ ! ద్రౌపదీప్రాణవల్లభులగు పాండవులయందు నీకృపాకటాక్షము మిక్కుటముగనే సంచరించుచున్నది. అందులోఁగూడ మధ్యమ పాండవుండగు నర్జునునకు యుద్ధకాలము మొదలుగ నెల్లసమయములందును చాల సహాయం బొనరించి యాతనియందు పక్షపాతంబతిశయంబుగ జూపుటకు కారణమ్మున్ బరికింప, ప్రాయశః నీవు ఇంద్రానుజుండవై యుంటివిగాన యట్టి సంబంధముననే ఇంద్రపుత్రుండగు నర్జునునియందింతటియభిమానముండును గాబోలు ఇచట నిరపత్యంబున పాండురాజు దుఃఖించుచుండు తద్భార్యగుకుంతి దూర్వాసలబ్ధమంత్రప్రభావంబున్ జేసి ఇంద్రునిస్తుతించి యర్జునుని బడసెనని భారతకథా.

శ్లో ॥ విశ్వాధీశోఽప్యగణితగుణోఽప్యాప్తసర్వాభిలాషోఽ ।
ప్యన్తర్యామ్యప్యనవధిదయః పార్థసారథ్యలక్ష్మ్యాత్ ॥

తస్యాశ్వాన్ కింసముపచరసి శ్రీశ మన్యే౽త్ర హేతుం ।
భావ్యశ్వత్వాభ్యసనమనుతః ప్రాప్తుమేవం కరోషి ॥౪౭॥

తా॥ హే లక్ష్మీపతే ! నీవు సమస్త జగంబుల నేలువాడవు వాచామగోచరుండవు సమస్తభూతాన్తరాత్మకుండవయ్యును. అనారతకృపాపరిపూర్ణుండవగుటచే అర్జునసారథ్యకాలంబున వాని యశ్వంబుల నెందులకై యుపచరించుచుందువనని నిట్లూహించెదము. ముందు దాల్పబోవు అశ్వత్వాభ్యాసమును నిపుడే వీటివల్ల బొందుటకై ఇట్లు జేయుచుందువేమో ఇచట కల్క్యవతారంబునను పరమాత్మునిండు అశ్వారూఢు డనియుండ నీతడు మాత్రము అశ్వస్వరూపుండని యే వర్ణించియుండుటయు సంగతమని భావించకూడదు. ఇందుకు గూడ తగిన ప్రమాణములుండుటచే జేసియిట్లు వర్ణించియుందును ప్రమాణమేమన (వాయుర్నస్తపోధనవరేణ్యమనః ఖలీనైః ఉదేష్యతి చయః కుహనాతురంగః) చంపుభారతము.

శ్లో॥ అథవా వాగధినాథో ।
హయవదనో౽భూః పురా మురారే త్వం ॥
తద్గతపరమప్రేమ్ణా ।
కిమిహ హయాంస్త్వ్యపోషయసి ॥౪౮॥

తా॥ ఓ మురారి ! అథవా నీవు పూర్వము వాగీశ్వరుండవై యున్నప్పుడు హయవదనుడవై యుంటివి. ఆకారణముచేతనే గాబోలు వాటియందలి మిక్కిలి ప్రేమచేత ఆ పార్థుని గుర్రములనంతగ బోషించుచుందువు. ఇచట శ్రీహరి హయగ్రీవ స్వరూపమున విద్యాధిదేవతయని సర్వవిదితము.

శ్లో॥ యుద్ధంసాత్యకినాసమంవిరచియన్ భూరిశ్రవాఃదూరతః
కౌంతేయేనతథ్రోపదేశవచసాంనిఘ్నోననంతాడితః।
ధర్మోఽసుంకిముకృష్ణరతేఽఘుపతిస్త్వంవాలియుద్ధేకృతాం
రీతింబోధయసీహవాశ్రితజనాంస్త్రాతుర్న తేభీరఘాత్॥

తా॥ హేమురారీ! సాత్యకితోఁగూడి యుద్ధము జేయుచున్న భూరిశ్రవుని నీమాటలంజవజాటని పార్థునిచే దూరమ్మునుండి మోసగించి జంపితివి. నీకిదిపాడియగున కృష్ణ! అథవా రామావతారంబున వాలిని మోసము జేతనే జంపితివి, గాన అట్టిపద్ధతినే ఇప్పుడు వీనికిగూడ బోధించెదవేమో స్వార్థంబువదలి కేవలం శరణు జొచ్చినవారిని గాపాడుటే ముఖ్యముగాగల నీకు అధర్మపుభయమెచ్చిటినుండిరావలయును? భక్తరక్షణము పరమధర్మంబు గాననందుకై జేసినపని సర్వజ్ఞుడగు నీకెన్నటికిని యధర్మముగా నేరదనియభిప్రాయము.

శ్లో॥ మృతంశిశుంజీవయత స్తవాస్మిన్
వృత్తేఽద్భుతంకృష్ణకిమస్త్యపూర్వం।
పురైవయస్మాద్రఘునాయక స్త్వ
మజీవయఃకంచనవిప్రసూనుం ॥౩౦॥

తా॥ హేయదుకులనాథ! నీవు పూర్వము రఘువంశంబున బుట్టినపుడే శబరతపస్సువలని వర్ణధర్మవ్యత్యాసంబున జేసి తండ్రి జీవించియుండ జచ్చిన బ్రాహ్మణపుత్రుని యా శబరవధచే బ్రదకించితివి కావున నిప్పుడు (గురుపుత్రుని) (ఉత్తరయొక్కపాపుని) బ్రదికించుట నీవింతపనులలో నిదియొకయపూర్వంబైన యద్భుతంబేమియున్ గాదు.

శ్లో॥ రామావతారేత్వమగాః ఫలాని
శుష్కాణి భోక్తుం శ్రమణీకుటీరం ।
తస్మాత్సఖా తేవిదితాంతరంగః
ప్రాదాత్కుచేలశ్చిపిటోపహారం ॥౧౮॥

తా॥ ఓయి వాసుదేవ ! నీవు రామావతారమ్మున దాల్చినపుడు వాడి వత్తులైన నీరసఫలంబులను యారగించుటకై శబరురాలగు శ్రమణీకుటీరంబునకును జనియుంటివి అందువలననే నీరహస్యముల న్నింటిని చక్కగ దెలిసినవాడును గావున నీచెలికాడగు కుచేలుడు నీరసంబులు కఠినంబులగు యటుకులను నీకుపాయనంబుగ నొసంగెను అనగ పరమాత్ముడు జనులు భక్తిచే యర్పించి యత్యల్ప పదార్థంబులను గూడ గొప్పయని భావించి ప్రీతిచే నారిగించును. అటుగాక య శ్రద్ధచేయమృతంబిడినను తుచ్ఛంబుగ భావించునని యాతని భక్తిపరవశత వెల్లడమగును.

శ్లో॥ మథ్యమానజలధేర్మణిమేకం
సుందరీమపిపురాసమవాపః ।
తద్వదేవపునరాప్తుమనాస్త్వం
జాంబవన్మథనతోఽసికృతార్థః ॥౧౯॥

తా॥ హేనందనందన ! వెనుక మథింపబడిన సముద్రము నుండి శ్రేష్ఠమైన కౌస్తుభమనురత్నమును, లక్ష్మీదేవియను స్త్రీల లామంబును గూడ బొందితివి. అదేరీతిగనే మరియు బొందనిచ్ఛగించి జాంబవంతుని మథించిస్యమంతకంబను రత్నంబును జాంబవతి యను స్త్రీలలామంబును గూడ చేకొని కృతార్థుడవైతివి. ఇచట

మథనమనగ సముద్రమునకు జిల్కుటయనియు జాంబవంతుని పర మున చాపులుయుద్ధంబనియర్థము.

(అవతారిక) ఇకముందు శ్లోకసప్తకంబులచే శ్రీకృష్ణుడు తన చెలికాండ్రులగు గోపస్త్రీలు సరససల్లాపం జేసెటప్పుడే ఉక్తిప్రత్యుక్తిరూపముగ మత్స్యాద్యవతారములస్ఫూర్తిని తెలియపరచిన వాడాయనని కవి వర్ణించుచున్నాడు.

శ్లో॥ నైర్ఘృణ్యాంతవవల్లభప్రియతమాస్వస్మానుయుక్తనుకిం
భీతాస్త్వయ్యనుపస్థితేనిశివయంతత్సోమంస్యాగమాత్ ॥
కింబ్రూథాఽబ్జదృశోపహతస్సతుమయైవామ్నాయహర్తాపురా
చంద్రోభీతికరః ప్రియ! ప్రియతమాః! మేమీనరూపంస్మృతం ॥

తా॥ ప్రాణవల్లభుడయిన శ్రీకృష్ణుని గురించి గోపవనితులు ఓయి కాంతుడ, నీవు ఈరీతిగ ప్రియతమెయులయిన మాయందు నిర్దయజూపి రాత్రివేళ రాకనే పోయితివివల్ల ఆ సోమకునిచేత (విర హతాపకారకుడైన చంద్రునిచే) మేము చాలాభయగ్రస్తులైతిమి" అని చెప్పగ, శ్రీకృష్ణుడు ,సోమక, అనె పేరును విని స్త్రీలు చంద్ర పరముగ చెప్పినారని యోచించక ముందు సోమకుడనె వేదాపహారి రాక్షసుణి స్మరించికొని „ ఓ అబలులా, ఇదేమి ! ఇటుల వచించితిరి! సోమకరాక్షసుని వెనుక నేనె మత్స్యావతారమెత్తి జంపినాను; పునః వాని బాధకలుగున ?" అని ప్రశ్నచేయంగ గోపస్త్రీలు—" మేము సోమకుడంటె చంద్రుడుదయించి మాకు విరహవ్యథ కలుగజేసెను అని చెప్పితిమి "అనిరి. శ్రీకృష్ణుడు—„ ఇపుడు తెలిసెను; మీరుపయోగించిన ,సోమక, శబ్దముచేత నాయొక్క మత్స్యావతారము స్మరణకు వచ్చెను. "అని తన మత్స్యస్వరూపమును తెలియజేసెను.

శ్లో॥ ముగ్ధాంగిమాంపరిరభ్యపీడయసికింముంచ ప్రియే త్వత్కుచ
క్షోణీభృద్వ్యవహారతస్సమనకింపీడాఽస్తిచేద్దారుణే।
ఏవంచేత్ప్రియయత్నతంచకింవహసిభోః ప్రాప్తుంసుధాంనాగత
ద్ధృత్యాసాకథమాప్యతేఽత్రసఖిమేకూర్మాకృతిస్సాక్షిణీ॥

తా॥ ఒక గోపస్త్రీ-(శ్రీకృష్ణునితో),, ఓ ప్రియుడా, ముగ్ధావస్థలోనుండె నన్ను కౌంగలించి వ్యర్థముగ ఏల హింస జేస్తావు? విడు" అనగ శ్రీకృష్ణదేవుడు-,, ఓ చంద్రముఖి, నీ కుచమనె పర్వతమును మోసేదానివల్ల నాకూ హింసగలుగదా? (కలుగను)" అనెను. పిమ్మట గోపి-,, అట్లయితే ఇద్దరుకూ బాధగలిగేపనిని ఏల చేస్తావు?" అనంగ, శ్రీకృష్ణుడు-,, ఓయి ప్రియురాల, అమృతప్రాప్తికొరకై (నీయొక్క అధరామృతప్రాప్తికి)" అనిజెప్పెను. గోపతరుణీ-,, దానిని(...పర్వతాన్ని) వహించినవల్ల అమృతప్రాప్తి యెటులకలుగను?" అని ప్రశ్న చేయగ శ్రీకృష్ణపరమాత్ముడు ,, ఓయి కాంతా, ఈ విచారములోన కూర్మావతారమే సాక్షిగానున్నది. అంటె ముందు క్షీరసముద్రమథనకాలంబు నేను మందరమను పర్వతాన్ని వహించి దేవతులకై అమృతాన్ని పొందితిని; ఇప్పుడు ఈ కుచపర్వత వహనచేత నీయధరామృతమును పొందుసాను" అని హాస్యముగ తన కూర్మావతారమును వ్యక్తపడించెను.

శ్లో॥ హేప్రేయఃపృథునీలరత్నసుషమాప్రస్పర్ధిశోభాజుష
స్తేక్రోడస్యవిలోక్యకాంతిమమితాంమోహాంగతాహంముహుః
త్వంభీరుసఖిమాంశకింయదునుతంజానాసిజానేతత
స్త్వద్వక్షఃపరిరంభణేచ్ఛురవదంభోనిత్కిటిత్వంస్మృతం॥౫॥

తా ॥ మరియొక్క గోపస్త్రీ-(శ్రీకృష్ణస్వామిని గురించి)„ఓయి ప్రియుడా, మరకతరత్నపుకాంతిని మీరించిన పరిపుష్టమైన నీక్రోడ మును (వక్షస్థళం) చూచి నేను చాలా మోహమును (ప్రీతిని) పొందినాను." అని చెప్పగ, అపుడు శ్రీకృష్ణుడు—„ నన్ను జూచి ఏల మోహమును (భయమూర్ఛావస్థ) పొందుసావు ? నన్ను సుకుమారుడైన యదువంశోత్పన్నుడని తెలియలేదో ?" అని ఆక్షే పించగ, ఆ గోపస్త్రీ—„ నిన్ను యదుకులరత్నుడని లెస్సగా దెలిసి నాను; దానివలనే (నీవక్షస్థలపు సౌందర్యమును జూచియే)నిన్ను కౌంగవలించవలెనని ఇచ్ఛయించి చెప్పితిని," అని సమాధానమిచ్చె ను, అప్పుడు శ్రీకృష్ణుడు—„ ఓహో ! నువ్వు, క్రోడ,శబ్దమును (పందియని అర్థము) వచించినదానివల్ల నాకు వెనుకటి వరాహా వతార స్మరణగలిగెను" అని తన వరాహావతార విషయమును ప్రకటించినవాడాయెను. (ననా క్రోడంభుజాంతరం-క్రోడోభూదార ఇత్యపి-ఇత్యుభయత్రాప్యమరః)

శ్లో ॥ ప్రహ్లాదంవత్సమారాదుపగతమదయస్తత్పితాఽజ్ఞః ప్రమత్త ।
శ్శృంగాగ్రాత్పాతయిత్వావ్యథయతితరుణీలోలుపస్త్వంనవేత్థ ॥
కింకింకాం తేతథాచేన్నరహరివపుషాహన్మితంస్తంభజస్సన్ ।
కోవానాథోద్యమోఽయంవృషదమనవిథాభోహిరణ్యస్సనృతోఽరిః॥

తా ॥ ఓయి స్త్రీలోలుడయిన నాయకుడ, అచ్చుటజూడు. ఆ ప్రహ్లాద వత్సమునను (సుందరమైన ఆవు దూడను) దాని తండ్రి (వృషభం=ఎద్దు) తన అజ్ఞత చేతలేక క్రొవ్వుచేతనూగూడి శృంగా గ్రపు తోడను తిమిసి, కెడిపి బాధపెట్టుతూ ఉన్నది; మాయందు క్రీడిస్తూ ఉండే నీకు ఇది ఎటులతానె తెలియవచ్చును ?" అని ఒక

గోపనాయకి సల్లాపించినప్పుడు శ్రీకృష్ణుడు—ఆ మాటలుకు సరిగా అర్థమెంచకనే „ ప్రహ్లాదంవత్సం, తత్పితా...ప్రమత్తః...వ్యథయతి. "అనె శబ్దమాత్రము చేతనే వెనకటి తన భక్తు ప్రహ్లాదుని, వాని తండ్రి శత్రువైన హిరణ్యకశిపువుని స్మరణకు తెచ్చుకొని. „ నాయకి, ఏమిచెప్పితివి ? అటులయితే ఈ క్షణమే నృసింహరూపమును బొంది స్తంభజుడయి ఆ నీచుని సంహారం జేసెదను. " అని గాబరిగా ప్రత్యుక్తినీయంగ, ఆ గోపి...„ ఓయి నాథుడా, ఎదో ఒక వృషభమును (ఎద్దును) తొలగించి వత్సముయొక్క హింసను నివారించుటకు ఈ యద్భుత ప్రయత్నములు, ఈ యాక్రోశము ఏమటికి ? " అని నప్పుడు శ్రీకృష్ణస్వామి—„ ముందు తన శత్రువుగా నుండిన హిరణ్యకశిపు స్మరణ కలిగెనని " నరసింహావతార విషయమును ప్రకటించినవాడాయెను.

శ్లో ॥ సర్వాస్స్వప్యబలాసు తేప్రియతమా కానాథసత్యంవద ।
త్వంరాధేమమవల్లభాబతశఠోऽస్యేవంప్రియేమావద ॥
కుబ్జాంనాథవిధాయసుందరతనూంతస్యాంతునక్తఃకిల ।
భ్రాంతే ! కుబ్జతనుఃపురాహమభవంప్రీతిస్తుతత్రాస్త్యతః ॥౫౭॥

తా ॥ రాధా అనె ఒక నాయకి శ్రీకృష్ణునితో సంభాషణ జేసెటప్పుడు „ ఓయి ప్రాణకాంతుడ, అనేక సహస్రరమణియులు నిన్ను ప్రీతించుచుండగా నీ కు అత్యంత ప్రియతమరాలు ఎవరితి ? నిజముగ పలుకు. " అని ప్రశ్న వేయంగ శ్రీకృష్ణుడు—„ ఓరాధ, నీవె నాకు అత్యంత ప్రీతిపాత్రరాలు " అని చెప్పెను. అప్పుడు ఆ రాధా—నీవు ఈ విషయమందు వంచన చెప్పినవాడయితివి. " అనంగ కృష్ణుడు— „ నువ్వు ఆ రీతిగ చెప్పకూడదు; నేను నీయందె ఖండితముగాను

అత్యంత ప్రీతియుంచినాను "అనెను. పిమ్మట ఆరాధా-కృష్ణునిపై ఆక్షేపించిన దేమంటె:—,, రూపవతియులూ, గుణవతియులూ, అయిన స్త్రీయువతియులందరినీ త్రోసివేసి, కురూపియయిన ఎవరితో కుబ్జా అనె స్త్రీయొక్క కురూపితనమును ప్రయత్న పురస్సరముగ పోగొట్టినవాడయి నీవు ఆమెయందు క్రీడాసక్తుడుగానుండలేదా ? " అనేది. శ్రీకృష్ణుడు—,, ఓ భ్రాంతరాల, నేను పురాతనకాలమందే కుబ్జావతారమునెత్తియుంటిని (వామనావతారం) దానివల్ల నాకు ఆ కుబ్జెయందు ప్రీతి కలిగినదాయెనువినా నీవే నాకు ప్రాణప్రియరాలు" అని హాస్యోక్తిగా తన వామనావతారమును తెలియజేసెను.

శ్లో ॥ కిం తేకాంత మనోజ్ఞ కుంతలభ రేసాంద్రాహి రేణుఃప్రియే।
కుతాస్సీద్విపినేగవాంఖురభ వాతాం రేణుకాంసంహార॥
మామాసుందరితాత వాఙ్నగడితః పాపంత్వాకార్ష్ణంపురా।
నాథోన్మాదవచఃకులిస్సఖిమ ...తద్భార్గవత్వాంస్మృతం॥

తా ॥ మరియొక నారీమణి-శ్రీకృష్ణుని సుందరమైన ముంగిరులులుయొక్క అందమును జూచుచు, ఓయి కాంతుడ, ఇదేమి ? నీతల వెంట్రుకలలోపుల వ్యాపించియున్నది ? అనంగ శ్రీకృష్ణుడు-ఓ నా ప్రియరాల, దట్టముగుమంటి రజఃకణములుగద అని చెప్పెను. నాయకి-ఇది ఎచ్చటనించి వచ్చిచేరెను ? కృష్ణ-అడవియందు పశువులుయొక్క కాళ్లు గొరసలుచే కలిగి వచ్చిచేరెను. నాయకి-అటులయితె ఆ రేణుకను (ధూళిధూసరమును) పోగొట్టినవాడుకా. అని చెప్పెను. ఈ ,, రేణుకాం-సంహార " శబ్దమునువిని శ్రీకృష్ణుడు-ఓ సుందరి, వలదు; అట్లజెప్పకూడదు. వెనుకైతె తండ్రియాజ్ఞకు బద్ధుడయి రేణుకామాతృసంహారం జేసితిని; ఇపుడు పునః ఆచెడ్డపని

చేయనా పెను అనంగ ఆ గోపస్త్రీ-మందస్మితరాలయి ఇదేమి ! నా థుడ, ఉన్మత్త ప్రలాపములనె పలుకసావు. నేను నీతలవెంట్రుకలలో నుండే రేణుకలను (ధూళిని) సంహార అంటె అభ్యంగనాదులచేత పరిహరించవలెనని చెప్పితిని వినా అన్యథా ఏమియు లేదు అనెను. అపుడు శ్రీకృష్ణ-ఓయి సఖి, నీవాడిన , రేణుకాం సంహార, మాటలు చేత నాకు వెనుకటి పరశురామావతారము జ్ఞాపకం వచ్చెనని విశద పరచెను. (రేణు= రేణుకా- స్వార్థేక ప్రత్యయః) (నానార్థములు:- రేణుకా=ధూళి, పరశురాముని తల్లి)

శ్లో ॥ భోభోనాథవిముంచఫల్గుసుషిరంకాష్ఠంకుతశ్చుంబసి
భ్రాంతేవేణురయంమనోహరరవఃకింనాస్తివాద్యాంతరం ॥
ముగ్ధేవంశవరేఽత్రమెబహుతరాప్రీతియ్యతోఽయంతదా ।
రామత్వేమమజానకీమపిదిశత్ భగ్నో మయాదోర్మదాత్ ॥

తా ॥ వేరొక్క గోపస్త్రీ-పిల్లంగ్రోవిని వాయించుచునుండే (శ్రీకృష్ణుని అధరచుంబనం చేసెటకు అవకాశము లేక పోయినదాని వల్ల) కృష్ణుని గురించి ,, ఓయి వల్లభుడ, నిస్సారమయిన, వ్యర్థమగు రంధ్రముల. తోడగూడిన ఈ శుష్క-కాష్ఠమును (వేణువుని) ఏల చుంబన జేస్తూఉన్నావు ? " అని ఆ కొళలు పైగలిగిన అసూయ చేత ప్రలపించెను. శ్రీకృష్ణుడు-,, ఓ భ్రాంతురాల, ఇది మనస్సుకు ఇంపుగలిగ జేసె ప్రసిద్ధమగు వేణువాద్యముగదు "అని ఉత్తరమిచ్చెను అపుడు ఆనాయకి-,, అటులైతె దీనినే ఏలవాయించవలెను ? ఇక ఘనతరమైన ఇతర వాద్యములు లేవా ? అనగ కృష్ణుడు-,, ముగ్ధరాల, వెనుక శ్రీరామావతారంబునందు, ఏవ వంశ (వెదురు) సంభవమైన ధనస్సుముఖాంతరమే నాకు ప్రియతమరాలగు సీతాదేవి సహ ధర్మి

ణిగా దొరకినప్పటికిన్ని నేను నాభుజబలపు క్రొవ్వుచేత విరించివేసితినో ఆ పశ్చాత్తాపమువల్ల ఇప్పుడుగూడ అదేవంశమందు బుట్టిన (వెదురునుంచి రచియింపబడున) ఈ పిల్లంగ్రోవిపై ప్రీతి జూపినాను." అని ప్రత్యుక్తిమీయుటచే తన శ్రీరామావతారమును ప్రకటించిన వాడాయెను.

(రామావతారమందు జనకరాజుని నియమానుసారముగ శైవధనువుని పైనెత్తుకొని జ్యా ఆరోపణమాత్రం జేసియుంటె చాలుగానుండును; విరించివేయుట అవశ్యముండలేదు అనినదె పశ్చాత్తాపకారణమని తెలియవలయును. నానార్థః:—వంశ=సంతతి, వెదురునూను. ద్వావంశౌ కులమస్కరావిత్యమరః)

(అవతారిక) పైన వివరింపబడిన సరసప్రసంగమాలకమే తన అనేక అవతారముల సంగతిని తెలియబరచిన శ్రీకృష్ణపరమాత్ముని భక్తవాత్సల్యమును గురించి కవి ఈ శ్లోకములో వర్ణించినాడు.

ఇత్థంవారేయువతిభిస్సహవాక్ప్రసంగే ।
ప్రత్నావతారవిభవంనిజమున్నయన్తః ॥
తాసాంహృదిప్రణయభక్తిరసాప్లుతేత్వాం ॥
యద్వాతతేసేవరమధామ్న్యపినిస్పృహోఽసి ॥౬౦॥

తా॥ ఓయి పరమేశ్వరుడ, ఈలాగున నీవు ప్రీతిపాత్రులచే సల్లాపం జేసెట వ్యాజమువల్ల అవతార విశేషములను స్పష్టముబడించి, వారివారి ఇష్టార్థంబులను చెల్లించుచున్నావుగాబోలు ఆ గోపాంగనలు మొదలయిన సమస్త భక్తజనులుగూడ నీయందు

గలిగిన ప్రేమరసభక్తిరసాస్వాదనచేత నిన్నె ధ్యానంజేయుచు నీపాద సేవలోనె నిరతులుగానున్నారు. దానివల నీకు ఆ సర్వశ్రేష్ఠమైన వైకుంఠపరంధామమునుంచి ఈ కృష్ణావతార సంబంధమగు శ్రీ గోష్ఠియే ప్రియమయి భూలోకమందుండుట అభిలాషను ప్రకాశ బరచితివి.

(అవతారిక) లోకోద్ధారార్థం అవతారందాల్చి విధ విధముగ తనవిలాసములును జూపిన భక్తవత్సలుడగు శ్రీకృష్ణపరబ్రహ్మ డే రక్షకుని ప్రపంచమంతయు దెలిసి ఇహాపర సౌఖ్యముల బొందని యని కవి మంగళం కోరినాడు.

శ్లో॥ యదుపతిపదసేవాసక్తచిత్తాస్సమస్తా
స్తదనవధిదయాయాః పాత్రతాంయాంతులోకాః ।
సుకవిఘణితయశ్చప్రాప్యకృష్ణప్రసాదం
దశసుచవిజయంతాందిక్షుకీర్త్యాసమేతాః ॥౬౧॥

తా॥ సమస్తజనులూ యదునాథుడైన శ్రీకృష్ణభగవానుని భజియించి వాని అవ్యాజకృపకు పాత్రులయి సుఖంబొందని. మరియు సుకవిజనులు శ్రీకృష్ణుని అనుగ్రహపాత్రులయి వాండ్లుచే రచియింపబడిన సరసకావ్యములు సర్వత్రవ్యాపకంబులై యశోవంతులుగాని.

(అవతారిక) ఇక కవి ఆధునికమగు తనగ్రంథ విషయమందు సజ్జనులు ఉదాసీనం జేయక నంగీకరించవలెనని ప్రార్థించుచు తన సర్వస్వమంతయు శ్రీకృష్ణార్పణం జేయుటచే గ్రంథసమాప్తి జేసినాడు.

శ్లో॥ అధునాతనేన కిల కేనచిత్కృతం
కిమిహాఽస్తి చేతికతిచిద్వ్యుదాసతే ।
యదునాథకృష్ణతవవృత్తమేతది
త్యపరేస్తువంతిసకలంచ తేఽర్పితం ॥౬. ౨॥

తా॥ ఎవ్వడో ఆధునికుడైన, అగణ్యుడైన సామాన్య కవిచే రచియింపబడిన ఈ గ్రంథంబులోనతిశయము మేమియున్నదియని కొందరు జనులు తిరస్కరించెదరు; ఇక కొన్ని జనులు ఇది పరమాత్మ విషయకమైనది గనుక గ్రంథము జూడదగినదియని పురస్కరించెదరు. అయినప్పటికిన్ని అజ్ఞుడైన నేను శ్రీహరిభక్తినే ప్రాధాన్యముగ నెంచి, ఈ గ్రంథమునూ నా సర్వస్వమంతయునూ హే శ్రీకృష్ణ పరమాత్ముడ, నీపాదారవిందములందు సమర్పణ జేసినాను.

శ్రీకృష్ణకథారహస్యం సంపూర్ణం



శ్రీః

శ్రియై నమః



శ్రీస్తవదశకం విజయతేతరాం

లక్ష్మీం పక్షీశలక్ష్మ్యాఢ్య వక్షస్థల కృతక్షణాం ।
అతీక్ష్ణేక్షణ వీక్షేవ క్షిప్రక్షేమ కరీం స్తుమః ॥౧॥

పురాణపుంసః పరతాద్యచిహ్నా ।
మదోఽవతారానుగుణావతారాం ॥
కృపావశత్రాతజగత్త్రయీం తాం ।
రమాం నమామ్యాశ్రితభూమసీమాం ॥౨॥

వారితాశ్రితజనాపదుచ్ఛ్రయాం ।
భూరిభాగ్యవిభవాధిదేవతాం ॥
నీరజాక్షదయితాం దయాంచితాం ।
క్షీరసాగరసుతాం రమాం భజే ॥3॥

శ్రితాం దేవీం వందే కరకలితపద్మాం శుభకరీం ।
సరోజాంతర్వాసాం వివిధ మణిభూషోజ్జ్వలతనూం ॥
నిజోత్పత్తిస్థానప్రభవదృఢలగ్నోర్మివలయాం ।
భ్రమాధాయి క్షౌమావృత మృదులరమ్యాంగలతికాం ॥

మునిశాపవిలుప్తసంపదింద్రో । యదపాంగామృతవీచిసేచనేన ॥
సమవాపపునశ్చనాకలక్ష్మీం । కుశలాప్త్యైసముపాశ్రయే శ్రియం తాం॥

ముఖపాణిపాదసురుణాంబుజందృశా ।
వసితోత్పలేచవసతిస్తవాంబుజం ॥
కమలంబిభర్షికమలేకరాంబుజే ।
నమతాంశిరస్సుసుమవత్ప్రకాశసే ॥౬॥

స్వయంకారుణ్యార్ద్రాయత హృదిహరావాత్మదయితే ।
ప్యవిస్రంభాదంబ్రణయ రసదంభాదయిరమే ॥
సమాశ్రిత్యప్రేమోహృదయ మసకృత్పోషితదయం ।
విధాయప్రాయస్త్వం సవృజినజనానప్యవసిహి ॥౭॥

తీక్ష్ణాలోకదృశాక్వచిజ్జడదృశాపశ్యన్ జగద్రక్షతి ।
స్వాతంత్ర్యాదవశోజనార్దన ఇతిఖ్యాతఃపతిస్తేరమే ॥
తద్వక్షస్స్థలమేత్య శీతలకృపాసాంద్రంమనఃకుర్వతీ ।
లోకాన్నావసిచేత్తదాకథమసౌ సంత్రాణదక్షోహరిః ॥౮॥

పద్మోద్భవేతిప్రథితంస్వనామ । విచిత్రరీత్యావివృణోషిపద్మే ॥
త్వదీక్షణాంభోజవశాత్త్వమేవ । సంభూయదీనాన్ కురుషేనిధీనాన్ ॥౯॥

కటాక్షలహరీం సుధారససమానసారాంస్వయం ।
జగజ్జననిమయ్యపిప్రహిణుతాదృశీమిందిరే ॥
యదీయకణసేచనప్రభవతారతమ్యాచ్ఛ్రితః ।
కృతాః స్వజలదోక్షహంసముఖవాహనాః కేచన ॥౧౦॥

శ్రీస్తవదశకేభక్త్యా । రచితేఽస్మిన్ జగ్గుశింగరార్యేణ ॥
దోషాన్ విహాయసంతస్తుష్యంతుపరంరమేవగుణలేశైః ॥శ్రీ॥

— సంపూర్ణం. —